## గంటల పంచాంగం

విరోధి సం॥ చైత్ర శు॥ చతుర్దశి
1949 సం॥ ఏప్రిల్ 12 మంగళవారం
శు॥ చతుర్దశి ప 1.14 హస్త రా 11.19
వర్జ్యం ప 9.35 ల 11.0 వ.
శు॥ పూర్ణిమ ఏప్రిల్ 13 బుధవారం
పూర్ణిమ ప 0.35 చిత్త రా 8.33 వర్జ్యం
ఉ 6.21 ల 7.49 వ.

ఆంధ్రపత్రిక
విరోధి సం॥ చైత్ర శు॥ చతుర్దశి
మంగళవారం

# విదేశ పెట్టుబడుల గురించి ప్రధాని ప్రకటన

విదేశ పెట్టుబడులకు దేశంలో గల అవకాశమునుగురించి గత బుధవారము పార్లమెంటులో భారత ప్రధాని పండిత నెహ్రూ ప్రకటన చేసెను. ఈ ప్రకటనపై ప్రత్యేక చర్చ జరుగుటకు అవకాశము లేకపోయెను. కాని కొన్ని పరిశ్రమలపై ప్రభుత్వము కంట్రోలు నుంచుకొనదలచిన బిల్లుపై చర్చ జరిగినపుడు సభ్యులు ప్రధాని ప్రకటన గురించి వ్యాఖ్యానించిరి. మొత్తం మీద సభ్యుల అభిప్రాయము, ప్రజాభిప్రాయము, ప్రధాని ప్రకటనకు సుముఖముగనే యున్నవని చెప్పవచ్చును. అమెరికా వ్యాపార వర్గములుకూడ సంతృప్తిని కనుపరచినట్లు వార్తలు వచ్చినవి. అదివరకే సమష్టిగా పరిశ్రమల నిర్మించుటకు, భారత, విదేశవర్తక ప్రముఖులకు సంప్రతింపులు జరిగినట్లు తెలియవచ్చినది.

ఆర్థికవేత్త కె. టి. షాగారు, పారిశ్రామిక ప్రముఖుడు హెచ్. పి. మోడీగార్లు తమ తమ దృక్పథములనుండి, విదేశపెట్టుబడుల గురించి అనుమానములను వెల్లడించిరి. ఇతర దేశస్థుల పెట్టుబడిని అంగీకరించిన రాజకీయముగ వారి ప్రాబల్యమును కూడ అంగీకరించవలసి వచ్చునేమో ననుభయమును వెల్లడించిరి. పరిశ్రమల కంట్రోలు బిల్లు నిబంధనలు ప్రభుత్వమునకిచ్చుచున్న అధికారములను గమనించిన ఏ దేశమునుకూడ అంతఉత్సాహముగ పెట్టుబడుల నివ్వ సంసిద్ధత చూపక పోవచ్చునని శ్రీ మోడీగారు అభిప్రాయపడిరి. పెట్టుబడిని సరఫరా చేయగలిగినది అమెరికా ఒక్కటేనని, ఆ దేశప్రభుత్వమునకు వ్యక్తి వ్యాపారస్వాతంత్ర్యమునందు విశ్వాసము కలదనియు, అందువల్ల పెట్టుబడి నివ్వ వారు సందేహించవచ్చునని సూచించిరి. వారి ఉభయుల ఊహలు కొంత అతిశయోక్తితో కూడుకొనినవే అని చెప్పవచ్చును. వారి పెట్టుబడిని ఆసించినంత మాత్రమున వారి ఆధిపత్యము, ఏర్పడుననుట ప్రస్తుత పరిస్థితులందు సాధ్యముకాదు. భారత నాయకులు ఆ విధముగ లొంగిపోవుదురని తలచుట అసమంజసము. సామ్రాజ్యములో భాగమివ్వక పోయినప్పటికీ, భారీ పరిశ్రమల నిర్మాణమునందు కూడ విదేశీయులు, పెట్టుబడిని అంగీకరించినచో, విదేశపెట్టుబడులను అంగీకరించినంతమాత్రమున స్వాతంత్ర్యం అనుభవించలేదు. నాటిని అంగీకరించుట [illegible] పండిత నెహ్రూ ఈ విధముగ వివరించెను.

"మనకున్న ధనముతో మన మనుకున్నంత విస్తృతముగా అభివృద్ధి నిర్మాణ కార్యక్రమమును సాగించలేని కారణముననే కాక, దానిలో అనేక విషయములందు అవసరమైన శాస్త్రజ్ఞానము, నిపుణుల సహాయము, కీలకయంత్రముల సరఫరా అవసరమున్నది." ఈ అంశమును గమనించిన విదేశ పెట్టుబడిసహాయమును అర్థించుట తప్ప గత్యంతరము లేదని తెలియగలదు.

విదేశీయులు ఏ షరతులకు లోబడ వలసినదీ ప్రధాని వివరించెను. వీటిని పరిశీలించిన విదేశ పెట్టుబడులు దేశమునకు హానికరముగ పరిణమించునని అనుకొనుటకు వీలులేదు. దేశీయ పరిశ్రమలకు ఏ విధమైన సదుపాయము లుంచునో వారికికూడ అదే విధమైన సదుపాయము లుంచగలవు. వాటి నిర్మాణము ప్రధానముగ దేశాభ్యుదయమును దృష్టియందుంచుకొని జరుగగలదు.

ప్రభుత్వము పరిశ్రమల కంట్రోల్ నిమిత్తము ప్రవేశపెట్టిన బిల్లునిబంధనలు గమనించిన విదేశ పారిశ్రామికులను ఆకర్షించక నిరోధించువనువాదమునకుఆస్కారము లేదు. అవి కొంతవరకు సందేహకారణము లైనప్పటికీ, ప్రధాని నెహ్రూ ఇచ్చిన హామీలు వారి సందేహములను పూర్తిగ నిర్మూలించగలవు. "విదేశ పరిశ్రమదారులు దేశమారక అవసరములకు లోబడి, తమ పెట్టుబడి మొత్తములను స్వదేశములకు పంపుకొనవచ్చును. లాభములను గణించవచ్చును. వాటిని భారతప్రభుత్వము వశముచేసికొనుట తటస్థించినపుడు, సమంజసమైన పరిహారము ముట్టచెప్పబడును. వారా పైకమును, స్వదేశమునకు పంపుకొనవచ్చును." ఈ విధమైన హామీ ఇచ్చినపిమ్మట వారేవిధముగనూ సందేహించ నవసరములేదు. ఏదో ప్రత్యేక సందర్భములందు తప్ప సర్వసాధారణంగా అధికభాగము, భారతీయులకే వుండి, ఆధిపత్యము భారతీయులకే వుండగలదను సూత్రమునకు వారు అభ్యంతరము చెప్పవీలులేదు. దేశాభివృద్ధిని ఆశించుచే పెట్టుబడిని అర్థించుటకు మూలము. తమకు ఏవిధమైన హానికలుగజేయు ఉద్దేశము భారతప్రభుత్వమునకు ఈ మాత్రము లేదనునదే వారు గుర్తించవలసినది. అంతటితోవారుసంతృప్తి చెందవలసియున్నది.

## మదనపల్లిలో 6 ఆరోగ్య కేంద్రములు

మదనపల్లి ఆరోగ్య కేంద్రాలు

మదనపల్లి:— మదరాసు ప్రభుత్వం వారి యుద్ధానంతర పంచవర్ష ప్రణాళికలలో గ్రామ పునరుద్ధరణ కార్యక్రమము సంబంధ మదనపల్లి తాలూకాలో 6 ఆరోగ్య కేంద్రాలు నిశ్చయించిరి. అందు రెండు, కొత్తకోట, నిమ్మనపల్లి యందు యీ సంవత్సరం స్థాపించుటకు జిల్లా ఆరోగ్య శాఖాధికారి నిశ్చయించిరి. ఒక్కొక్క కేంద్రంలో 6 మంచాల డిస్పెన్సరీ ఒక డాక్టరు, నర్సు, కాంపౌండరు ఉందురు.

డా॥ రాజేంద్రప్రసాదు

గాంధీ స్మారకనిధి వసూళ్లకు గాను డా॥ రాజేంద్రప్రసాదుగారు ఏప్రిల్ 23 బెంగుళూరు మైసూరు, 25 తేది హుబ్లికి పోయెదరు. 27 గదగ్, బారల్కోటు, బెల్గాం, హోయి 28 బళ్లారి మీదుగ మదరాసునకు వచ్చెదరు.

వింధ్యప్రదేశ ప్రధానిలో విశ్వాస రాహిత్యం

[illegible], 10: వింధ్య ప్రదేశ కాంగ్రెసు సంఘసభ్య సభలో నేను జరిగినపుడు ప్రధాని అవదేశ ప్రతాపసింగుపై విశ్వాసరాహిత్య తీర్మానం ఆమోదించబడెను. 23 గురు సభ్యులు హాజరయ్యిరి శ్రీ [illegible] సింగు గారు అధ్యక్షత వహించిరి.

# శ్రీ నాగేశ్వర ద్వాదశ వర్ధంతి

## ఆంధ్రపత్రికా కార్యాలయంలో ఉత్సవము

మద్రాసు, ఏప్రిల్ 10: ఈ రోజు సాయంత్రము, 5-30 గం॥లకు ఆంధ్రపత్రికా కార్యాలయములో, విశ్వదాత దేశోద్ధారక శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి ద్వాదశ వర్ధంత్యుత్సవమును ఆంధ్రపత్రికా నిర్వాహకోద్యోగులు జరిపిరి. పత్రికా స్థాపకులగు శ్రీ పంతులుగారి పటమును పుష్పమాలాలంకృతముచేసి, పటమునకు దీపధూప నైవేద్యములను మంగళహారతులను సమర్పించిరి. పంతులుగారినిగూర్చి ఉపన్యాసములు జరిగినవి.

శ్రీ నాగేశ్వరరావుగారి దాతృత్వాది గుణసంపదను, ఆనాటి నాయకులందరినీ కూడకట్టుకొనివచ్చిన ఆయన కార్యదక్షతను, నేటి ఆంధ్రోద్యమములగు వాటి కన్నింటికి ప్రప్రథమమున పంతులుగారెట్లు చేయూత నొసగి యుజ్జ్వలమొనర్చిరన్న యు, పంతులుగారి అభ్యుదయగామిత్వమును, లేదవసరమున ఆయన ఒనర్చిన అపారసేవయు, మొదలగు విశేషములన్నియు ఉపన్యాసకులు సూక్ష్మముగ వివరించిరి.

ఉపన్యాసముల యనంతరము, సభికులెల్లరకు ఫలచందన తాంబూలాదు లొసంగుటతో సభ ముగిసెను.

# అంతర్జాతీయ వ్యాపారవృద్ధి

## సుంకపూర్వక ప్రతిబంధకముల తొలగించుటకు సమాలోచనలు

అన్నేసీ (ఫ్రాన్సు), ఏప్రిలు 11: ప్రపంచములోని వివిధ రాజ్యములతో పరస్పర వ్యాపారవృద్ధికై ఫ్రాన్సులో సమాలోచనలు ప్రారంభింపబడినవి. సుంకముల మూలంగా ఏర్పడిన ఆటంకములను తొలగించదలంచుచున్నారు, అందు కొరకై ఫ్రాన్సులో అన్నేసీ అను పట్టణమందున్న చిన్న హోటళ్ళలో అతి రహస్యంగా వివిధ దేశాల వర్తక వ్యాపార ప్రవీణుల సమాలోచనలు జరుగుచున్నవి. 34 రాజ్యాలనుండి 700 మంది వ్యాపార ప్రవీణులు విచ్చేసిరి. వీరు సమాలోచనలు చేయుచున్న భవనము చుట్టును పోలీసు దళము చాలా మెలకువగా కాపలా కాయుచున్నది—ఈ సమాలోచనలు 3 మాసములవరకు జరుగును. ఈ చిన్న పట్టణములో 14 పెద్ద హోటళ్లు కలవు—ప్రపంచములోని అనేక రాజ్యముల నుండి అధికారులు చాలామంది ఇచటికి విచ్చేయుటవల్ల యీ చిన్న పట్టణము నేడు కళకళలాడుచూ ఉన్నది. ఇచట ఈ వర్తక విషయ సమాలోచనలు నేడే ప్రారంభమైనవి. ఈ ఊరిలోని జనసంఖ్య 27 వేలు మాత్రమే ప్రపంచ వ్యాపారంలో సగంవరకు వ్యాపారం ఏ సరకుల మూలంగా జరుగుచున్నదో ఆ సరకులకు సంబంధించిన రేవు సుంకముల రేట్లను ముఖ్యంగా తగ్గింపదలంచుచున్నారు. జినీవాలో 2 సం॥ క్రిందట జరిగిన అంతర్జాతీయ వ్యాపారపు ఒడంబడిక సూత్రములను అనుసరించి యీ రీతిగా సుంకముల విధానం మార్పు చేయవలెనని సంకల్పించబడెను. అమెరికావారి మార్షలుపథక సహాయం పొందుచున్నటువంటి బ్రిటను, బెల్జియం, ఫ్రాన్సు, లక్సంబర్గు, హాలెండు, నార్వేలు యీ సంప్రతింపులందు పాల్గొనుచున్నవి.

అమెరికా యున్న బ్రిటనున్న కలిసి ఒక అంతర్జాతీయ వ్యాపార మండలిని ఏర్పాటు చేసియుండెను. ఈ వ్యాపార మండలియందు 21 రాజ్యములు మెంబర్లుగా చేరెను. మరొక 11 కొత్త రాజ్యములు చేర్చుకొనుటకు యిప్పుడు సమాలోచనలు జరుగుచున్నవి. డెన్మార్కు, స్వీడెను, ఇటలీ గ్రీసు అను 4 రాజ్యాలు (మార్షలు పథకం ద్వారా అమెరికా ద్రవ్యసహాయం పొందుచున్న రాజ్యాలు) పై జెప్పిన 11 రాజ్యాలలో చేరియున్నవి. మిగిలిన 7 రాజ్యాలు ఏవనగా, కొలంబియా, ఫిన్లండు, హాయిటీ యురుగ్వే, లైబీరియా, నికొరాగువా, డొమినికను రిపబ్లికు, వివిధ రాజ్యాల ప్రతినిధుల మధ్య 250 పరస్పర రాజ్యాల సంప్రతింపులు జరుగగలవని యున్నవి. ఇచటి సమాలోచనలయందు పాకిస్తాను, ఇండియాలు కూడ చేరియున్నవి.

## కౌన్సిలు ఎన్నికలో కాంగ్రెసు అభ్యర్థి విజయం

చెన్నపట్నం, ఏప్రిల్ 11: [illegible] నియోజకవర్గం స్థానమునకు డా॥ [illegible] శ్రీనివాసన్‌గారు కాంగ్రెసు అభ్యర్థిగా మదరాసు కౌన్సిలుకు ఎన్నుకోబడిరి. కాంగ్రెసు అభ్యర్థికి 297 ఓట్లు, ప్రత్యర్థి బాలకృష్ణ మొదల్యారుగారికి 289 ఓట్లు వచ్చెను. ఒక ఓటు చెల్లలేదు.

# భారత సైనికవ్యయము తగ్గనందుకు కారణములు

## ఆర్థికశాఖ కార్యదర్శి మీనన్ వివరణ

న్యూఢిల్లీ, ఏప్రిల్ 10: అంతరంగిక భద్రత విషయమున సాధారణ పరిస్థితులు యింకను యేర్పడకపోవుటచేత మనము కోరునంత శీఘ్రముగా సైనికవ్యయము తగ్గకున్నది. ఇదిగాక విదేశీయుల దురాక్రమణ నుండి భారతదేశమును రక్షించుటకు యెంత ద్రవ్యమవసరమో సరిగా అంచనా వేయ వీలుకాలేదు అని ఇండియా ప్రభుత్వ ఆర్థికశాఖ కార్యదర్శి శ్రీ కె. ఆర్. కె. మీనన్ గారు బ్రాడ్‌కాస్టు ప్రసంగము గావించుచు చెప్పిరి.

దేశాభివృద్ధి కార్యక్రమములకు తగినంత ద్రవ్యము లభ్యమగుటకుగాను త్వరలో సైనికవ్యయమును తగ్గించ జాతీయ ప్రభుత్వము వాంఛించుచుండినదని ఆయన చెప్పుచు ఏదేశములో నైనను అంతరంగిక భద్రతకు, విదేశములనుండి ఆపదకలుగకుండునట్లు చూచుటకు తొలిప్రాధాన్యమొసంగవలెననుట స్పష్టమనిరి.

ద్రవ్యోల్బణమునకు ప్రతిక్రియలు

ద్రవ్యోల్బణమునకు ప్రతిక్రియగా ప్రభుత్వము వారవలంబించిన చర్యలను మీనన్‌గారు వివరించుచు మిగులు ద్రవ్యమును శీఘ్రముగా ఆకర్షించుటకుగాను రాబడి పన్నును తాము త్వరగా వసూలు చేయుచుండిరని హెచ్చులాభాల పన్ను డిపాజిట్లను ముజరాయిచ్చుట మానివేసిరని, కంపెనీలు వాటాదార్లకొసంగబడిన లాభాలకు శాసనపూర్వకముగా హద్దులేర్పరిచిరని, భోగవస్తువులపై ఎక్సైజ్ పన్నులు విధించిరని శ్రీ మీనన్ గారనిరి. ఈ సంవత్సరము కేంద్రప్రభుత్వమువారు ఖర్చుకూడ తగ్గించమనిరి.

పారిశ్రామిక ఉత్పత్తిని పెంపొందించుటకు ప్రభుత్వమువారొక మంచి స్కీమును గూడ అవలంబించుచుండిరనిరి. యంత్రములపైనను, పారిశ్రామిక ముడిపదార్థముల పైనను పన్ను తగ్గించిరనిరి. ప్రత్తిమీలుపై పన్ను రద్దుచేసిరనిరి. ఈ చర్యలు ప్రభుత్వమువారవలంబించిన యితర చర్యలు ద్రవ్యోల్బణము నరికట్టుటకు చాలా తోడ్పడెనని, త్వరలో ఈ కృషిలో విజయము కలుగునని ఆయన చెప్పెను. ద్రవ్యోల్బణమునకు ప్రతిక్రియగా ప్రజలు స్వల్పమొత్తములను మిగుల్చుకొనుటకు ప్రభుత్వమువారు గావించిన సౌకర్యములను మీననుగారు వివరించిరి. రెండు రకములైన సేవింగ్సు సర్టిఫికేట్లను, ఒకటి 5 సంవత్సరములకు, మరియొకటి 7 సంవత్సరములకు జారీచేసిరనిరి. దేశమునందలి మారుమూల ప్రదేశములలో నైతము ప్రజలు ద్రవ్యమును మిగుల్చునట్లు చేయు ప్రయత్నములలో తము రాష్ట్రీయ సంస్థానంలో ప్రభుత్వముల తోడ్పాటు గైకొనుచుండిరనిరి.

ఆర్థిక శాఖ నూతన దృక్పథము

మన ప్రభుత్వముకో చేర్పడిన నూతన స్వాతంత్ర్య భావమును ఆర్థికశాఖ బాగుగా ప్రతిబింబించుచుండెనని, భావి నిర్మాణ కార్యక్రమములను సాగించవలసిన ఆవశ్యకతను తాము బాగుగా గ్రహించుచుండిరని, తామనుసరించుచున్న ఆర్థిక విధాన లక్ష్యము దేశాభివృద్ధియేనని ఇదివరకు ఆంగ్లబ్యాంక్ ఉత్తరవులను పాలించుచుండిరని, ఇప్పుడు ఈవిధానము సంపూర్ణముగా మారినదని మీనన్ గారనిరి.

పన్నుల విషయమై ప్రసంగించుచు ఇండియా ప్రభుత్వము ఉప్పు పన్నును రద్దు చేసిరని మీనన్ గారనిరి.

ప్రజలు లాభసాటియైన పరిశ్రమలలో ద్రవ్యము పెట్టుబడి పెట్టవీలగుటలోను, ఉత్పత్తిదార్లు హెచ్చుగా ఉత్పత్తి చేయ వీలగుటకుగాను రాబడిపన్ను సూపరటాక్సు మార్చబడెననిరి.

విదేశములతో భారతదేశ ఆర్థికసంబంధముల విషయమై ప్రస్తావించుచు భారతదేశము స్వతంత్రదేశముగా బ్రిటన్‌లో స్టెర్లింగ్ నిల్వల విషయమై ఒడంబడిక చేసికొనెనని అంతర్జాతీయ ద్రవ్యనిధిలోను అంతర్జాతీయ బ్యాంకులోను ప్రత్యేక సంబంధము కలిగియుండిరనీ, తామలంబించుచున్న ఎగుమతి, దిగుమతి కంట్రోలు విధానము స్వతంత్రమైనదిగా నుండెనని వ్యాపారము వృద్ధిచేయుటే దాని ఉద్దేశ్యమని మీనన్‌గారనిరి.

ఆహారము విషయమై ప్రసంగించుచు ఈ సంవత్సరము భారతదేశము విదేశముల నుంచి చాలా ఎక్కువ ధాన్యమును, సామాన్య ప్రజలకు అందుబాటులో నుండని ధరలకు దిగుమతి చేసుకొనిరని మీననుగారనిరి. లేకనాగశులకు వాటాపు 31 కోట్ల రూపాయలు ప్రత్యేకింపబడెననిరి. రాష్ట్రములలో అధిక ఆహారోత్పత్తికి తగినంత ద్రవ్యము ప్రత్యేకింపబడెనని, [illegible] నిర్మాణ సంస్థలు, ఎరువు నిర్మాణ ఫాక్టరీ, ఉప్పు భాగసము మున్నగు వానికి తగినంత ద్రవ్యము ప్రత్యేకింప బడెననిరి.

దామోదర వ్యాలీ ప్రాజెక్టు, సర్వదవతి సబర్మతీలకు ఆనకట్టలు కట్టు స్కీములకు తొలి ప్రాధాన్య మొసంగబడెనని, వివిధ విద్యా శాస్త్రీయ పరిశోధక సంస్థలకు ద్రవ్యము ప్రత్యేకింపబడెనని శ్రీ మీననుగారనిరి.

# నిజాంలో ఆంధ్ర ఉద్యోగులు

## ప్రభుత్వ వైఖరిగూర్చి ఆంధ్ర కాంగ్రెసు హెచ్చరిక

సికిందరాబాద్, ఏప్రిల్ 10: సంస్థాన ఆంధ్ర(రాష్ట్ర) కాంగ్రెస్ కార్యవర్గంవారు నేడు సర్దార్ జమలాపురం కేశవరావుగారి అధ్యక్షతను సమావేశమై ప్రధాన అధికారాలలో ఉన్న కొద్దిమంది ఆంధ్రులను వారి పూర్వపు ఉద్యోగాలకు తగ్గించివేసే విధానాన్ని ఆపివేయవలసిందని ప్రభుత్వాన్ని కోరుతూ ఒక తీర్మానంచేసిరి. ప్రభుత్వం తానులోగడ ప్రకటించిన అభిప్రాయాలకు విభిన్నంగా స్థానికంగా ఉన్న మేధావంతులను నిర్లక్ష్యం చేసి, బయటి ప్రాంతాలనుండి అధికారులను దిగుమతిచేస్తున్నందుకు అసంతృప్తివెల్లడించుచూ వేరొక తీర్మానం చేసిరి. సెలెక్టు అయిన ఆంధ్రులలో చాలామందికి చిన్న చిన్న ఉద్యోగా లివ్వబడుచున్నాయని కార్యవర్గం అసంతృప్తి వెల్లడించెను. ప్రభుత్వోద్యోగుల్లో ముఖ్యంగా యీ రెవిన్యూ అధికారుల్లో అవినీతి అంతులేకుండా పెరిగిపోతోందని ప్రభుత్వం దృష్టికి తెస్తూ, ఇటువంటి విషయంలో ప్రభుత్వం వెంటనే తగు చర్యతీసుకొని యీ ఉపద్రవాన్ని నిర్మూలించ వలసిందని కోరుతూ ఇంకొక తీర్మానం చేశారు. కార్యవర్గం నేడురాత్రి చాల పొద్దుపోయినతర్వాత గూడ చర్చలు యింకా కొనసాగిస్తోంది.

## కాంగ్రెసువాది మరణము

గుడివాడ ఏప్రిల్, 10: తూర్పుకృష్ణా జిల్లా కాంగ్రెస్ సహాయకార్యదర్శి, శ్రీరాజనాల సుబ్బారావుగారు యిలా తెలియపర్చుచున్నారు.

కైకలూరు తాలూకా కాంగ్రెస్ ప్రధానకార్యదర్శి తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ సభ్యుడు అయిన శ్రీ నల్ల పోతురంగాదాస్ 6-4-1949 న అకస్మాత్ గా ముదినేపల్లిలో సుండె జబ్బుతో మరణించినారని తెలియపరుచుటకు చాలా చింతించుచున్నాను. అతని వయస్సు 28 చాలా చిన్న వయస్సుఅయినప్పటికి అతను ప్రప్రథమమునుండి దేశసేవలో నిమగ్నుడై చేసిన సేవ అపారము. ఈతని మరణమూలముగా మరితీరనిలోటు సంభవించింది. యీతని కుటుంబమునకు సానుభూతి తెలియపర్చుచున్నాను. స్వ. వి.

## డా॥ బీర్బల్ సహాని భవనంలో జరిగిన వింత

లక్నో, ఏప్రిల్ 10: ప్రఖ్యాతి వృక్షశాస్త్రజ్ఞుడు డా॥ బీర్బల్‌సహాని గతరాత్రి ఇంక కొంచెం సేపటికి చనిపోవుననగా, 11.45 గంటలకు ఆయన భవన ద్వారము వద్దనున్న గంట 15 నిముషాలసేపు కొరగ రసించంగా శకున సూచకంగా మ్రోగుట మొదలిడినది. దానిని ఆపివేయుటకు విద్యుత్ప్రసారతంత్రులు త్రెంచివేయవలసి వచ్చింది.

ఇంక 5 గంటలకు చనిపోవుననగా డా॥ సహాని తన భార్య సావిత్రిదేవికి వీడ్కోలిచ్చుచు తన జీవితమంతయు అంకితమొనర్చిన వృక్ష పరిశోధనాలయమును జాగ్రత్తగా చూచుచుండు మని ఆదేశించెను.

# ప్రార్థన సమయాన ప్రమాదం

నూయిఫాల్సు (డకోటా) ఏప్రిల్ 10: అమెరికను స్టేటులో డకోటా దక్షిణ భాగమున నారియను గ్రామమున చర్చియందు 150 మంది జనులు ప్రార్థనలు చేయుచుండగా, పెద్ద ప్రేలుడుతో భవనం కూలిపోయింది. చాలామంది చనిపోయారనుకొంటున్నారు. మూడు గంటలయినతరువాత 4 గురు శవాలు, 12 మంది గాయపడినవారు తీయబడిరి. చర్చిమందిరాన్ని వేడిగా యుంచుటానికి ఉంచిన నిప్పు గుండం ప్రేలి, మూడు ఎగురగొట్టి, గొంగుగోడలను పనులగొట్టెను. భవనమంతా మొలకెత్తి బోరన కుని రాకకై ఎదురు చూచుచున్న సమయాన, ప్రేలుడు జరిగెను. 6 గురు చనిపోయినట్లు తెలిసెను. ఎందరు గాయపడిరో తెలియదు.

## ఢక్కాకు సర్ సీతారామ్ రాక

ఢక్కా, ఏప్రిల్ 11: పాకిస్తానులో ఇండియా హైకమిషనరు సర్ సీతారామ్ ఇవాళ ప్రొద్దున విమానంలో ఇక్కడికి వచ్చెను. ఢక్కాలోని ఇండియా డెప్యూటీ హైకమిషనరు సంతోష్ కుమారబోస్, ప్రభుత్వ సమాచార శాఖ తరఫున సర్ సీతారాంను స్వాగతమిచ్చిరి. సర్ సీతారామ్ ప్రభుత్వ భవనంలో మకాము చేయును.

# సిరియా-ఇజ్రాయిల్ సంప్రతింపులలో ప్రతిష్టంభన

బెలటీక్, ఏప్రిల్ 11: ఇజ్రాయిల్‌తో యుద్ధవిరమణ సంప్రతింపులు ఇవాళ ప్రారంభించబడునని సిరియా పరిపాలకుడు కల్నల్ హుస్నీ జైమ్ నిన్న ప్రకటించినప్పటికీ సంప్రతింపులు ప్రారంభం అయేదాకా నమ్మకం లేదని విషయజ్ఞులు చెప్పుచున్నారు. తాత్కాలిక యుద్ధవిరమణతో ఉత్తర్వు జారీ అయినతర్వాత ఏరి యన్లు దానిని భంగంచేసి 233 సం. పర్వతమును ఆక్రమించుకొనిరనీ, ఈ పర్వతమునుంచి సిరియన్లు ఉపసంహరించుకుంటేనే గాని తాము రాయబారములు ప్రారంభించమనీ, ఇజ్రాయిల్ సిరియా ప్రతినిధులకు సందేశం పంపినది. కాని సిరియా దీనికి లొంగి వచ్చేట్టూ కనిపించలేదు. సందేశం తీవ్రధోరణిలో వున్నదనీ, మాటలధోరణి మారిస్తే తాము యీ విషయమై రాయబారాలకు దిగుతామనీ సిరియన్లు అంటున్నారట.

పాలస్తీనా రాజీసంఘం ఏప్రిల్ 24 న లేదిన లూసానులో సంప్రతింపులు ప్రారంభించునని విశ్వసనీయంగా తెలియుచున్నది. కవిరావన్ వేసిన ప్రశ్నలకు ఇజ్రాయిల్ వద్దనుంచి సమాధానం రాగానే కాందిశీకుల వ్యవహార్యక్రమం విషయమై అధికారరీత్యా ప్రకటన జరుగుతుంది.

## పాలస్తీనాపై రౌండ్‌టేబుల్ సమావేశం

టెల్ అవీవ్, ఏప్రిల్ 10: పాలస్తీనా వివాదంతో సంబంధమున్న అన్నిపక్షాలవారు బహుశా ఈ మాసాంతంలో జనీవాలో జరిగే రౌండ్ టేబుల్ సమావేశంలో పాల్గొనాలని ప్రపంచ జాతులసభ సామరస్య సమితి చేసిన సూచనలపై వచ్చేవారం ప్రారంభంలో సమావేశం జరిపే ఇజ్రేల్ మంత్రివర్గం నిర్ణయం తీసుకొంటుందని తెలుస్తున్నది. సామరస్య సమితిలోనియుగ్దురుసభ్యులు అప్పుడే బెయిరూట్ నుండి ఇక్కడకు వచ్చి, సంభాషణలను ప్రారంభించారు. గ్లోబ్

టెల్ అవీవ్, ఏప్రిల్ 10: ఇజ్రేలీ సిరియన్ యుద్ధవిరమణ సంధి సంభాషణలలో కలిగిన ప్రతిష్టంభనను తొలగించే నిమిత్తం ఇజ్రేలీ అధికారులతో రెండు గంటలు సంభాషణలు జరిపిన ప్రపంచ జాతుల సభ ప్రతినిధులు, హెన్రీ విగియర్ జనరల్ డబ్లియు, ఇ. రైలే గారలు కర్నల్ హూస్నే ఎల్ జైమ్‌గారిని కలియ డానికై డమాస్కస్ వెడతారు. గ్లోబ్

## బ్రిటిష్ స్థానికసంస్థల ఎన్నికలు

లేబర్ పార్టీ ఓటమి

లండన్, ఏప్రిల్ 10: ప్రస్తుతమండల సంఘముల ఎన్నికలలో బ్రిటిష్ లేబర్ పార్టీవారు 333 స్థానములు గొల్పోయిరని 83 స్థానములను కొత్తగ సంపాదించుకొనిరని పార్టీ ప్రధాన కార్యాలయమువారు ప్రకటించుచున్నారు. ఇంగ్లండు వేల్సునందలి 62 మండల సంఘములలో 55 సంఘములకు జరిగిన ఎన్నికల ఫలితములివి. అన్ని సంఘముల ఎన్నికల ఫలితములు రేపు మధ్యాహ్నము ప్రకటితమగునని అనుకొనుచున్నారు. ఇంతవరకు 258 స్థానములను గోల్పోయిన ప్రభుత్వపక్షమువారు ముఖ్య సంఘములగు మిడిల్ సెక్సు, ఎస్సెక్సు, నార్దంబర్‌లాండ్లపై ఆధిపత్యము గోల్పోయిరి.

## యాంట్సేనది దాటు కమ్యూనిస్టుల ప్రయత్నం

1 వ పేజీ తరువాయి

మరొక ఉద్దేశ్యముతో మూడు కమ్యూనిస్టు సేనలు యాంట్సేనదిని దాటు చురుకుగా సన్నాహములు చేయుచున్నవని పీపింగ్ రేడియో నేడు ప్రకటించెను.

చైనా విముక్తి జరుగుచున్న దరి ఆత్మకమగు పోరాటము యిందువల్ల అంతమగునని, అణగద్రొక్కబడుచున్న 20 కోట్ల చైనా ప్రజలకు యిది శాంతి చేకూర్చునని పీపింగ్ రేడియో చెప్పెను.

యాంట్సేనది ఉత్తర ఒడ్డున ఉంట కెంపుక కమ్యూనిస్టుసైన్యములు పురోగమించుచున్నారని మరొక సైన్యం దక్షిణదిశగా సాగిపోవు సూచన, పెకింగ్ కమ్యూనిస్టు రేడియో ప్రకటించింది.

యాంట్సేనది దక్షిణ ఒడ్డున కమ్యూనిస్టులను ఎదుర్కొనుటకు సన్నద్ధముగా 5 లక్షల ప్రభుత్వ సైన్యం మోహరించబడి యున్నది.

కన్నెకా పరమేశ్వర దేవస్థానమందు 12 వ తేదీన సా 5-30 ల [illegible] హరికథ శిరోమణి ఎం. నరసింహశాస్త్రిగారు లంకాదహనం కాలక్షేపం జరిపెదరు.

# కృష్ణా గుంటూరు కాంగ్రెసు వివాదములు

## రాష్ట్రపతి పరిష్కరించును

న్యూఢిల్లీ, ఏప్రిల్ 11: ఇక్కడ రెండు రోజులుగా జరుగుచున్న కాంగ్రెస్ కార్యవర్గసమావేశం నేటితో సమాప్తమైనది. నేటి సమావేశం సర్దార్ వల్లభాయ్ పటేలు నివాసంలో 3 గం॥ సేపు జరిగింది. రాష్ట్రపతి డా॥ పట్టాభి సీతారామయ్యగారు సమావేశమునకు అధ్యక్షత వహించిరి. కాంగ్రెస్ పరిపాలనకు సంబంధించిన అంశములు ఈ సమావేశంలో చర్చించబడినవి. కాశ్మీరునుగురించి మరల ఏమీ చర్చ జరగలేదని తెలియుచున్నది.

[illegible] జిల్లాలో తీవ్రంగా లేచుచేస్తున్న సత్యాగ్రహం కూడ కాంగ్రెస్ కార్యవర్గ సమావేశంలో చర్చకు వచ్చింది. ఇందులో ప్రసక్తిఉన్న వివిధ పక్షాలలో రాష్ట్రపతి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపవలెనని నిర్ణయింపబడెను.

కృష్ణా గుంటూరుజిల్లా కాంగ్రెసు కమిటీల వివాదములను పరిష్కారము చేయుటకు రాష్ట్రపతికి కాంగ్రెసు వర్కింగు కమిటీ అధికారమిచ్చెను. గుంటూరుజిల్లా కాంగ్రెసుకమిటీ విషయంలో మెంబర్ల అర్హతలనుగురించి వివాదం వచ్చెను. 1947 వ సంవత్సరంలో కాంగ్రెసు సభ్యులను చేర్చుకొను సందర్భంతో గుంటూరు కృష్ణాజిల్లాల కాంగ్రెసు కమిటీలలో వచ్చిన వివాదమునుకూడా రాష్ట్రపతియే పరిష్కరించెదరు. వింధ్య ప్రదేశసంస్థానచెందిన కాంగ్రెసుకమిటీని రద్దు చేయవలెనని తీర్మానించబడెను. దానిస్థానే ఒక తాత్కాలిక కమిటీని రాష్ట్రపతి ఏర్పాటు చేయవలెనయు, అ. భా. కాంగ్రెస్ కమిటీ తరఫున 25 ప్రతినిధికి పంపించి వింధ్యప్రదేశ కాంగ్రెస్ కార్యాలయ వ్యవహారములను అప్పజెప్పవలెననియు తీర్మానించెను.

కాంగ్రెసునున్న దానితోపాటు పనిచేయుచున్న ఇతర ప్రజా సంస్థలకున్న ఉండవలసిన వ్యవహార సంబంధములు గూర్చి విమర్శించి ఒక నివేదికను తయారు చేయుటకు కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి నియమింపబడెను.

## విశాఖపట్నానికి తైల పరిశోధనాగారం

చెన్నపట్నం, ఏప్రిల్ 11: విశాఖపట్నంలో తైల పరిశోధనాగారాన్ని నెలకొల్పుటకు 2 చ॥ మైళ్ల ప్రాంతము నిశ్చయించబడెననియు, ఆ నేల పెద్ద యంత్రముల భారానికి నిలవనో లేదో అన్నది పరిశీలించుటకు భూశాస్త్ర శాస్త్ర పరిశోధకులు కొలదిరోజులలో అక్కడికి పోవుచున్నారని పరిశ్రమ మంత్రి హాలహర్వి సీతారామరెడ్డిగారు నేడు పత్రికా ప్రతినిధులతో తెలిపిరి.

## క్రికెటు ఆటనుండి అమర్‌నాధ్‌కు బహిష్కారం

బొంబాయి ఏప్రిల్ 10: ఇండియా క్రికెటు కంట్రోలు బోర్డువారు నేడు ఎ. ఎస్. డీమెల్లో అధ్యక్షతను సమావేశమై లాలా అమర్‌నాథ్ ఇండియా తరఫున గాని, ఏదైనా ఒక రాష్ట్రం తరఫునగాని క్రికెటు ఆటలో పాల్గొనరాదని బహిష్కరిస్తూ తీర్మానం చేసిరి. క్రమశిక్షణను ఉల్లంఘిస్తూ అతడు ప్రవర్తించుటవల్లనే యీనిర్ణయం చెయ్యబడింది. ఆస్ట్రేలియా ఇప్పటికప్పుడు, వెస్టు ఇండీస్ జట్టు ఇండియా వచ్చినప్పుడు లాలా అమర్‌నాథ్ ఇండియాజట్టుకు కాప్టెనుగా ఉండెను.

## సోవియట్ యుద్ధ సలహా సంఘ సమావేశం

మాస్కో, ఏప్రిల్ 11: కొత్తగా నిర్మాణమైన సోవియట్ యుద్ధ సలహా సంఘం మార్షల్ స్టాలిన్ అధ్యక్షతన అనేక రోజులపాటు ఇక్కడ సమావేశం అయ్యింది.

15 మంది హంకేరిక సేనానులు సమావేశమునకు ఆహ్వానింపబడిరి.

యూరపులోని పోలీసు బ్లాకు సోవియట్ సైన్యంలోకి ఆహ్వానించబడుచున్నారు. ఈ విధంగా సమీకరించబడిన అనేకమంది సైనికులు సైన్యంనుండి తప్పించుకొని పశ్చిమ జర్మనీకి పారిపోయిరి.

ఫిన్లాండులో కమ్యూనిస్టుల చర్యలు అంతకు అంతకు ఉధృతమౌతున్నవి. కమ్యూనిస్టులు జనరల్ సమ్మె చేసి జాతీయ జీవితాన్ని స్తంభింపజేయవలెనని యత్నించుచున్నారు.

## యుగోస్లావియా-బల్గేరియా వాదం

సోఫియా, ఏప్రిల్ 11: బల్గేరియా సరిహద్దున చేయుచున్న ఆరోపణలను బల్గేరియా [illegible] ఖండించింది. యుగోస్లావియా మార్చి 12 వ తేదీన పంపిన నోటు నిరాధార మని బల్గేరియా తిరస్కరించింది.

# సికింద్రాబాద్ హైదరాబాద్ కాంగ్రెస్ ఎన్నిక

## అరవముద అయ్యంగారి మధ్యవర్తిత్వం

హైదరాబాదు, ఏప్రిల్ 8: ఆంధ్ర "బి" (హైదరాబాదు, సికింద్రాబాదు ప్రాంతము) అధ్యక్షుని ఎన్నికపై వచ్చిన వివాదమును పరిష్కరించి తీర్పు చెప్పుటకై, సంస్థానకాంగ్రెసు అధ్యక్షులు స్వామీ రామానందతీర్థ, మాజీ మంత్రి దివాన్ బహదూర్ అరవముదు అయ్యంగారిని న్యాయాధిపతిగా నియమించిరి.

హైదరాబాదు, సికింద్రాబాదు నగరములలోనుండి పలుకుబడిని సంపాదించుకొనిన మహారాష్ట్రులు, కన్నడులు, నగరములు ఉమ్మడి ప్రాంతములని 1947 లో పేచీపెట్టిరి. హైదరాబాదు తెలుగునగరము పెరుమటనున్న దెబ్బదిమైళ్ళవరకును తెలుగుప్రాంతమే— ఆ పైననే కర్ణాటకము ప్రారంభమగును. ఉత్తరమున ఒకటి రెండు తెలుగుజిల్లాలు దాటిన తరువాతనే మహారాష్ట్రదేశము ప్రారంభమగును. అట్టి హైదరాబాదు రాజధానీ నగరమగుటచే, ఉమ్మడి ప్రాంతమైనది. హైదరాబాదుకు సికింద్రాబాదునుకూడా కలిపివేసిరి. మహారాష్ట్రులు కన్నడులు పెట్టిన పేచీపై తీర్పు నిచ్చుటకు డా|| పట్టాభి సీతారామయ్య, దివాకర్, శంకరరావుదేవ్ గార్లతో కూడిన ఒక సంఘము 1947 లో నియమింపబడెను. ఆ సంఘమువారు నగరములను ప్రత్యేకరాష్ట్రముగా పరిగణించి, దానిని ఆంధ్ర "బి" అని పిలువవలెనని తీర్పునిచ్చిరి.

అటుపిమ్మట ఆంధ్ర "బి" కి శ్రీ మహదేవ్ సింగ్ అధ్యక్షుడుగా ఎన్నుకొనబడెను. కాని నవంబర్ 1948 లో జరిగిన అఖిల హైదరాబాదు కాంగ్రెసు సభ్యుల సమావేశానంతరము సోషలిస్టులు కాంగ్రెసునుంచి బయటపడుటకు నిశ్చయించుటచే, మహదేవ్ సింగ్ గారు అధ్యక్షపదవికి రాజీనామా నిచ్చిరి. అదే సమయములో కాంగ్రెసు కూడా రెండు చెక్కలయి పోవుటవలన ఆంధ్ర "బి" ఎన్నికల ప్రసక్తియే లేకపోయెను. స్వామీజీ గ్రూపు తరఫున మాత్రము హైదరాబాదు నగర కాంగ్రెసు అధ్యక్షులుగా డా|| మేల్కోటె, సికింద్రాబాదు నగర కాంగ్రెసు అధ్యక్షులుగా రామ్ లాల్ గారు పని చేయుచుండిరి.

కాని కాంగ్రెసువారు, రెండు కాంగ్రెసులక్రింద కాక ఒకే కాంగ్రెసు పేర పని చేయవలెనని తిరిగి నిశ్చయించుకొనిన తర్వాత ఆంధ్ర "బి" అధ్యక్ష కార్యవర్గపు ఎన్నికలు ప్రారంభమయ్యెను. అధ్యక్షపదవికి నిలబడు వ్యక్తుల విషయమై ఎంతేమో ఊహాగానము జైనప్పటికిని, అనేకులు విరమించుకొనిరి. ఒక్క పండిత నరేంద్రజీ మాత్రమే తాను అధ్యక్షపదవికై నిలచుచున్నానని ప్రకటించెను. పండిత నరేంద్రజీ చాలా ఏండ్లనుంచి ఆర్య సమాజికుడుగా పనిచేసి అనేకబాధలు పడి ప్రజాదరణకు పాత్రుడైనవాడు. నేడు కాంగ్రెసులో చేరినాడు. అందువలన పండిట్ జీకి అనేకులు కాంగ్రెసువారు అండగా నిలచిరి. ముఖ్యముగా ఆంధ్రులందరును నరేంద్రజీనే సమర్థించిరి.

కాని ఇంతలో సంస్థాన కాంగ్రెసు ఆఫీసునుంచి మరియొక ప్రకటన వెలువడెను—శ్రీ ధరణీధర సంఘీ అను ఒక వ్యక్తి అధ్యక్షపదవికై పోటీ చేయుననిఆ ప్రకటన. ఎన్నికల అధికారియైన శ్రీ మాణిక్ వైద్యనాథన్, సంఘీగారి నామినేషన్ పత్రము సరిగా లేదని త్రోసివేయుటచే నరేంద్రజీ అధ్యక్షుడుగా ఎన్నిక అయినట్లు ప్రకటింపబడెను. నరేంద్రజీ కార్యవర్గ సభ్యులను కూడా నియమించివేసెను. కాని ఆంధ్ర "బి" డెలిగేట్ల స్థానములు ఆరు ఖాళీగా నుండుటచే, వాటిని పూర్తి చేయవలసి యుండెను. ఆ పని ఆంధ్ర "బి" ప్రాంత అధ్యక్షుడు చేయవలసినది. కాని, సంస్థాన కాంగ్రెసు కార్యదర్శి శ్రీ ప్రాణేశాచారి మాత్రము ఆ ఎన్నికలు జరిగిపోవలెనని ఉత్తర్వులు చేసిరి. పండిత నరేంద్రజీ, ఆ ఎన్నికలను వాయిదా వేసిరి.

ఇంతలో అధ్యక్షుని ఎన్నిక విషయములో, శ్రీ ధరణీధరసంఘీ, తనకు అన్యాయము జరిగినదని చెప్పుకొనుటచే, ఆ అన్యాయముపై విచారణ జరుపుటకు స్వామీజీ ఒక న్యాయాధిపతిని నియమించిరి. ఆ న్యాయాధిపతి మాజీ మంత్రి దివాన్ బహదూర్ శ్రీమాన్ అరవముదు అయ్యంగారు. శ్రీ అయ్యంగారు ఏప్రిల్ 5 వ తేదీ విచారణ ప్రారంభించిరి. శ్రీ ధరణీసంఘీ తరఫున నల్గురు న్యాయవాదులు వాదించిరి. వారిలో ఒకరు దయాశంకర సంఘీగారు. మిగిలిన ముగ్గురు: గోపాల్ జోషి, బి. యల్. జైన్, రామచంద్రరావు నందాపూర్కర్ గారలు. ఇక శ్రీ నరేంద్రజీ తరఫున కొండా లక్ష్మణ్ గారు శ్రీ కల్లూరి బసవరాజుగారు. కాని శ్రీ అయ్యంగారు విచారణను వాయిదా వేసిరి. ఎందువలననగా: కాంగ్రెసు నిబంధనావళి లోని ఏడవ సూత్రం ప్రకారము, రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గము 2/3 వంతు సభ్యుల అమోదముతో ముగ్గురు వ్యక్తులుగల విచారణ సంఘమును నియమించుట కధికారము కలిగియున్నది. రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గము అవినయముగా చేయలేకున్నచో, సంస్థాన కేంద్ర కాంగ్రెసు కార్యవర్గమువారు ముగ్గురు వ్యక్తులుగల విచారణ సంఘమును నియమింపవచ్చును.

నిబంధనావళి ఇట్లు చెప్పుచుండగా ఈ శ్రీమాన్ అయ్యంగారిని న్యాయాధిపతిగా నియమించుటకు స్వామీజీకి అధికారము లేదుకదా అని లక్ష్మణ్, రాజుగారలు వాదించిరి. స్వామీజీకి ఈ ముఖ్య సంబంధ న్యాయ సంబంధమైన సలహాల నిచ్చుచున్న శ్రీమాన్ అయ్యంగారు, ఇది విచారణ యోగ్యమైన వాదనేనంటూ, అయినను ఈ విషయమై స్వామీజీతో సంప్రదించుట అవసరమని తెల్పుచూ, విచారణను అనిర్దిష్టముగా వాయిదా వేసిరి.

## గ్రామాలపై కమ్యూనిష్టుల దాడులు

### ఒక గ్రామస్థుని హత్య

హైదరాబాద్, ఏప్రిల్ 9: నల్లగొండ జిల్లా హుజూర్ నగరం తాలూకాలోని ఒక గ్రామంపై సాయుధ కమ్యూనిష్టుల సంఘ ఒకటి యీ నెల 5 వ తేదీరాత్రి దాడిచేసి, ఒక గ్రామస్థుని హత్య చేసినారనీ అనేకమందిని చావ చితక బాదినారనీ యిక్కడకు వార్తలు వచ్చినవి. జనగామ జిల్లాకు 12 మై. దూరంలోనున్న వేరొక గ్రామంపై కమ్యూనిష్టులు దాడిచేసి, గ్రామ పట్వారీ యింటినుండి 60 వేల రూపాయలు దోచుకొన్నారని కూడ వార్తలు వచ్చినవి. ఈ సందర్భంలో పోలీసులు అనుమానంమీద కొంతమందిని అరెస్టు చేసిరి.

హైదరాబాద్, ఏప్రిల్ 9: ఉపాధ్యాయులు హిందూస్థానీని దేవనాగరిలిపి నిర్బంధంగా నేర్చుకోవాలని ఆదేశింపబడిరి. ఇందుకొరకు సంస్థానంలో పలుచోట్ల దేవనాగరిలిపి తరగతులు ప్రారంభించబడుచున్నవి.

## ఇండియాప్రభుత్వ పరిశ్రమల మంత్రి

మదరాసు, ఏప్రిల్ 9: ఇండియా ప్రభుత్వ పరిశ్రమల మంత్రి శ్రీ శ్యామప్రసాద్ ముఖర్జీ ఈనెల 29 వ తేదీన మదరాసు వచ్చెదరని తెలియుచున్నది

శ్రీ ముఖర్జీ 27, 28 తేదీలలో బెంగుళూరులో జరుగు సిల్కుబోర్డు మీటింగులో పాల్గొని 29 వ తేదీన మదరాసు పరిశ్రమలమంత్రి శ్రీ హాలహర్వి సీతారామ రెడ్డిగారితో కూడ ఆల్వేపల్లి మదరాసు వచ్చెదరు.

ఆల్వేలో శ్రీ ముఖర్జీ, సీతారామరెడ్డి గార్లు అచటి పరిశ్రమలను పరిశీలించెదరు.

శ్రీ సీతారామరెడ్డిగారు 27 వ తేదీన బెంగుళూరు వెళ్ళెదరు.

## వీరేశలింగంథీస్టిక్ హైస్కూలు వార్షికోత్సవం

రాజమహేంద్రవరం, ఏప్రిల్ 9: ఈ పట్నంలోనున్న వీరేశలింగం థీస్టిక్ హైస్కూలు వార్షికోత్సవము, పూర్వవిద్యార్థి సంఘ వార్షికోత్సవము యీ నెల 15 న జరుపబడును. డివిజనల్ స్కూల్సు ఇన్ స్పెక్టరును, హైస్కూలు పూర్వ విద్యార్థియు అగు డి. రామయ్యగారు అధ్యక్షత వహించెదరు. ఇటీవల అమెరికాలో మరణించిన సుప్రసిద్ధ శాస్త్రవేత్తయు, యీ హైస్కూలు పూర్వ విద్యార్థియు అగు డా|| ఎల్లాప్రగడ సుబ్బారావుగారి తైలచిత్రము ఆరోజున ఆవిష్కరింపబడును.

## విద్యార్థి కాంగ్రెస్ కార్యవర్గం

తాడేపల్లిగూడెం, ఏప్రిల్ 8: ఈ పట్టణ విద్యార్థి కాంగ్రెస్ కార్యవర్గ సమావేశం కె. వి. సాంబశివరావు అధ్యక్షతను జరిగెను. విద్యార్థు లందరు కాంగ్రెస్లో చేరి అజ్ఞాతవాసంలోనున్న కమ్యూనిష్టులను పట్టుకొనుటలో ప్రభుత్వానికి తోడ్పడవలసిందని ఒక తీర్మానం చేసిరి. చెన్నపట్నంతో సహా ఆంధ్రరాష్ట్రం వచ్చేవరకు సత్యాగ్రహం చెయ్యవలసిందిగా ఆంధ్రు లందరిని కోరుతూ ఇంకొక తీర్మానము చేసిరి.

## నర్సాపురం సహకార గృహ నిర్మాణ సంఘం

నర్సాపురం ఏప్రిల్ 6: స్థానిక సహకార గృహ నిర్మాణ సంఘానికి డాక్టర్ రామరాజుగారు అధ్యక్షులుగను, జె. ఎస్. వి. కనకాచలం గారు కార్యదర్శిగను, జి కృష్ణమూర్తి, ఎం. శ్రీనివాసాచార్యులు జోరి నారాయణ మూర్తిగార్లు డైరెక్టర్లుగను ఎన్నుకోబడిరి.

## రేషను కార్డుల పంపిణీ

### మదరాసు ప్రభుత్వ ప్రకటన

మదరాసు, ఏప్రిల్ 8: నగరములో రేషన్ కార్డుల పంపిణీ సందర్భములో ప్రజలకిబ్బందులను అతిశయోక్తులను చేర్చి మద్రాసు మెయిల్ పత్రిక "వదనాగ్రలు పడియుండుట" అనే శీర్షిక క్రింద ఏప్రిల్ 4 తేదీన వ్రాసియున్నది. క్రొత్తకార్డులను ఇచ్చుటలోగల ఇబ్బందులను పత్రిక సరిగా గుర్తించినట్లు తోచదు. మార్చి 31 తో అంతమగు పాతకార్డులస్థానే క్రొత్తకార్డులను పంపిణీచేయుటకు నగరమంతటా ఏర్పాట్లు చేయవలసియున్నది. నగరములోని 8 లక్షలపైచిలుకు రేషన్ కార్డుల మింజుమలే నూటికి 90 వంతులు ఇళ్లవద్ద రేషన్ సిబ్బందిచే అందజేయబడినవి. తక్కిన కార్డులు ఈ క్రింది కారణములవల్ల పై రీతిగా పంపిణీచేయుటకు వీలు గలుగలేదు.

(1) నగరములో ఇంటినెంబరు, వీధి పేరులేని సుడిసెలు కొన్ని వేలున్నవి. ఎంత ప్రయత్నించినను ఇట్టి సుడిసెలలో వుండేవారి జోగట్టా అందలేదు.

(2) కొందరు వారివారి పనులమీద బయటకు వెళ్లినందున అట్టివారికి అందజేయుటకు వీలుపడలేదు.

(3) అనేకమంది కార్డు పొందినవారు వారి చిరునామా మార్పులను నియమముల ప్రకారము సర్కిల్ రేషనింగ్ ఆఫీసుకు తెలుపవలసి యున్నా తెలుపలేదు. ఇటువంటి కార్డులన్నీ ఆఫీసుకు తిరిగి పంపబడినవి.

మార్చి 25 లోగ కార్డులు పొందని వారందరు ఆయా ప్రాంత రేషనింగు ఆఫీసునుండి కార్డులు తీసుకొన వలసినదిగ కోరబడిరి. మార్చి ఆఖరు వారములో సహజముగ జనములు నుమిగూడి వుండవచ్చును. అయినా సాధ్యమైనంత త్వరలో వారిని పంపుటకు కావలసిన ఏర్పాటులు అన్నీ చేయబడినవి. ఏప్రిల్ 1 దరిమిలా రేషన్ ఆఫీసులలో జన సమర్దము మామూలుకంటె మించి ఏమీ లేదు.

క్రొత్త కార్డులను జారీ చేయునప్పుడే దొంగకార్డులను తీసివేయుటకు తగిన సమయమనికూడా అందరూ గమనించవలెనని ప్రభుత్వము కోరుచున్నది. కార్డుల చిరునామా మార్పులను ఎప్పటికప్పుడు తెలిపియుండిన ఇంతమాత్రము ఇబ్బంది కూడ వుండెడిది కాదు: కాబట్టి ప్రజలందరు రేషనింగు నియమములను పాటించుచు సహకరించవలసినదిగ ప్రభుత్వము అర్థించుచున్నది.

### డిటెన్యూల విడుదల

మదరాసు, ఏప్రిల్ 8: మదరాసు ప్రభుత్వము ఈ క్రింది డిటెన్యూలను విడుదల చేయవలసినదిగ వుత్తర్వు చేసినది: శ్రీ యస్. రాజమానికం, కె. గోవిందస్వామి, యస్. మారిముత్తు, వి అయ్యాస్వామి, టి. శంకరన్, వి. యం. రామయ్య, యల్. సోమసుందరం, సి. శంగోడన్, టి. కాళిముత్తు యస్. వీరాస్వామి, ఆర్ చెల్లస్వామి.

మలయానుంచి వచ్చిన వీరందరు మదరాసు ప్రజారక్షణచట్టము (1947) క్రింద నిర్బంధించబడిరి.

శ్రీ పి. వెంకటప్పయ్య (చిత్తూరు జిల్లా) కొసరాజు శేషయ్య (కృష్ణాజిల్లా) గార్లనుకూడ విడుదలచేయుటకు ప్రభుత్వము వుత్తర్వు చేసినది. వీరుకూడా ప్రజారక్షణ చట్టముక్రింద నిర్బంధించబడిరి.

## బియ్యం నిలువ

మదరాసు నగరంలో 7 వ తేదీన 12709 టి. బియ్యంగలవు. 41 రోజులకు సరిపోవును. ఏప్రిలు 2 తే. సరికి రాష్ట్రంలో బియ్యం నిలువ 4,98,794 టన్నులు గలదు. అటుక్రితంవారంకన్న 23755 టి. ఎక్కువ. 2 తే. తో అంతమయ్యే వారంలో 39167 టి. ధాన్య సేకరణ జరిగెను. క్రితం వారంకన్న 200 ట ఎక్కువ.

జిల్లావారీగా ధాన్యసేకరణ సంఖ్యలు యీవారం గతవారంవి యీ దిగువ రీతి కలవు-తూ. గోదావరి 1540టి-1702టి ప. గోదావరి 8177టి-5005. తంజావూరు 7719టి-8127టి. కృష్ణ-4946టి-4580టి. నెల్లూరు 3280టి-2011టి. గుంటూరు 2259టి-2674.

అమెరికా ఎర్రజొన్నలు మదరాసు ప్రజలు బాగుగా వాడిరి. కనుక అట్టివానిని ఎక్కువ సరఫరా చేయమని మదరాసు ప్రభుత్వంవారు ఇండియా ప్రభుత్వాన్ని కోరిరి.

### సరస్వతిమహల్ తాళగ్రంథ ప్రదర్శనం

తంజావూరు జిల్లా తిరువాయూరులో సరస్వతి మహల్ లోని పురాతన గ్రంథ పత్ర ప్రదర్శనము 16 వ తేదీనుండి జరుగును. ఆంధ్ర మంత్రి భక్తవత్సలం, మాజీ మంత్రులు రామస్వామిరెడ్డి, అవినాశిలింగంగారలు, కేంద్ర ఉపమంత్రి సంతానం మున్నగువారలు పాల్గొందురు. తమిళ విజ్ఞానాభివృద్ధిలోనికి సంబంధించిన అనేక విషయాలలో ప్రశంసలు ఉపన్యాసములు ఇచ్చెదరు.

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, G. T. Madras.

## విజయవాడ లేఖ

### శ్రీరామనవమి ఉత్సవాలు-నాయకత్రయ కమిటీ నివేదికను గూర్చి విమర్శలు-బందరుపోయే రైళ్లు-నీటిలోపము

ఏప్రిల్ 8: శ్రీరామనవమిని విజయవాడలో ప్రతియింటా యథాశక్తిని ప్రతి హిందూకుటుంబము జరిపారు. తెలుగులకు ముఖ్యమైన ఈ పండుగను వర్తక సంఘాలు, భక్తసమాజాలు పేటపేటయందు వీధివీధియందు పందిళ్లు వేసి సీతారామ కళ్యాణాన్ని 42 చోట్ల ఈపట్టణంలో భారీగా జరిపారు. నవమినుండి చైత్రపౌర్ణమివరకూ ఈపందిళ్లలో హరికథలు చెప్పించి, భజనలు చేయించి ఆధునిక భక్తబృందాలి నాటకాలుకూడా వేయించి రాత్రులందు ప్రజలకు భక్తిప్రచారము చేయుదురు.

నిన్న జరిగిన సీతాకళ్యాణోత్సవములకు ప్రతి పందిరిలోను వేలాది ప్రజలు చూచి ఆనందించారు. భక్తావేశాలతో సీతాకళ్యాణమును చూచి తలంబ్రాలు గింజల యెగబడి ప్రోగుచేసి యిండ్లకు తీసికొనిపోయి కళ్యాణము చూడలేని వాళ్ళ శిరస్సులమీద ఈతలంబ్రాలు విదిలించారు. ఆంధ్రదేశంలో ఈపండుగను జరిపినంత భక్తి శ్రద్ధలతో యేపండుగా జరుగదని చెప్పవచ్చు. పేరుపొందిన హరిదాసులు ఈ పట్టణంలో శ్రీరామనవమి పందిళ్లలో కథలు చెప్పేతారు. ప్రతియింట పానకం, వడపప్పు చేసి స్వామిపేరట ఇరుగుపొరుగు వారిని పిలిచి ఈ ఫలాహారమును పంచుతారు. నిన్న కనీసం 10 పుట్ల బెల్లంపానకం ఒక పుట్టి వడపప్పు ఈ పురవాసులు సేవించి జానకీకల్యాణంచేసి ధన్యులైరి.

కాంగ్రెసు అగ్రనాయకత్రయం భాషా ప్రయుక్త రాష్ట్ర సిద్ధాంతము పైన యిచ్చినరిపోర్టు ఆంధ్రులలో చాలా నిరుత్సాహన్నే కల్పించింది. ఆంధ్రరాష్ట్రం సత్వరయేర్పాటుకు మద్రాసుపట్టణం మినహాయింపు వరకు కాంగ్రెసు నాయకత్వము పైన కినుక కల్పించింది. థార్ కమిటీ రిపోర్టుకంటె ఒకమెట్టు పైకిపోయి ఆంధ్రులకు నష్టం కలుగజేశారు. భాషా రాష్ట్ర సిద్ధాంతమున కాదిపేరమైన శ్రీ పట్టాభిగారుకూడా ఈ రిపోర్టుపైన యెలా సంతకంపెట్టారా అని ఆశ్చర్యపోతున్నారు చాలామంది. ఒరిస్సారాష్ట్రంలో బలవంతాన చేర్చబడిన ఆంధ్రులగతి అధోగతే అని అనుకుంటున్నారు. దీని విషయం పట్టాభిగారు విపరంగా ఈ రిపోర్టునుగురించి ఆంధ్రులకు తెలియపరచవలసిన బాధ్యత వారిపైనున్నది. ఈ రిపోర్టు వర్కింగుకమిటీ చర్చకు వచ్చినప్పుడు కార్యదర్శి కళా వెంకటరావుగారు, ఆచార్య రంగాగారు కూడా ఒప్పుకొని దేశంమీదరుద్దారా అని కొంతపెద్దలు అభిప్రాయపడుతున్నారు.

ఈ వారంలో రెండుసార్లు వానలు కురిసినందున ఈ పట్టణంలో మశూచి వ్యాధి తగ్గు మొహం పట్టింది. తక్కిన వారాలతో పోల్చిన ఈ వారంలో స్ఫోటకం వ్యాప్తి చాలా తక్కువ. చావులు కూడా చాలా తగ్గినయి. కృష్ణకాలువలు ఈ నెల అయిదవ తేదీనుండి కట్టివేసిరి. మరల మే 15 న కాలవలకు నీరు వదలవలెనని పి. డబ్ల్యు. వారి అంచనా. ఈలోగా కాలువల మరమ్మతులన్నీ పూర్తియైన యెడల.

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం ఆఫీసులో కాంగ్రెసు సభ్యత్వం రాబడి తగ్గుతుందన్న కారణంచేత సిబ్బందిని, ప్రయాణం ఖర్చులను యింకా తదితర ఖర్చులను తగ్గించుటకు ప్రయత్నాలు చేస్తున్నారు. సిబ్బందికి చ్చే జీతాలను నూటికి 10 వంతున తగ్గించారు. ఆఫీసు కార్యదర్శి వెంకటసుబ్బయ్యగారు ఉద్యోగం విరమించే ప్రయత్నంలో వుండి ప్రస్తుతం శెలవుతీసుకొన్నారు. ఔలిగ్రాము లివ్వడం మాని ఉత్తరాలు వ్రాస్తున్నారని తెలుస్తోంది. ట్రంకు కాల్సు బిల్లు మూడు వంతులు తగ్గించబడింది.

జిల్లాబోర్డు యెన్నికల సభ్యులిచ్చే డిపాజిట్లు కొంత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసాఫీసు ఆదాయాన్ని వృద్ధిచేయవచ్చు.

ఏప్రిలు నెలనుండి విజయవాడ బందరు పోయేబండ్ల టైములు మారినయి. ఇదివరకు తెల్లవారుజామున 4½ కు విజయవాడనుండి బయలుదేరే బండి యిప్పుడు 3-15 నిముషములకు బయలుదేరుతోంది. ఆ బండి ఇప్పుడు అంతా ఖాళీగానే పోతోంది. మరి యెందుకు మార్చారో యీవిధంగా తెలియదు. పోనీ ఆ బండికి అందించే బండ్లు కూడా లేవుకూడాను. తరువాత ఉదయం 5-30 కు పోయే మెయిలుబండివుంది. దీని తరువాత 9-30 గంటలవరకూ వేరేబండి లేదు. ఆ తెల్లవారుజామున పోయే బండిని తీసి ప్రజాసౌకర్యము కొరకు విజయవాడకు ఉదయం 7½ కో 8 గంటలకో బయలుదేరే యేర్పాటు చేస్తే బాగుండును. గుడివాడకి కప్రదేశం నుండి పాలు పెరుగు విజయవాడకు తీసుకొచ్చే వాళ్ళకొరకు ఒక ప్రత్యేకం బండి ఉదయం 7 గంటలకు చేరేలాగున ఒక స్పెషలు బండిని వేయుటం చాలా అవసరం. ఈ పెరుగు కుండలు, పాలబిందెలు క్రిక్కిరిసున్న పెట్టెలెక్కించిదింపుకోటం వచ్చేవాళ్ళకు యిబ్బంది. యెక్కేదినే ప్రయాణీకులకూ యిచ్చింది. సుమారు పాలు పెరుగు తెచ్చేవీజను టిక్కెట్లవారు 300 మంది వున్నారట. ప్రయాణీకులబత్తిడిలో కనీసంరోజూ అయిదారు పెరుగు కుండలు బద్దలవడం, రెండు మూడు పాలబిందెలు ఒలికిపోవడం జరుగుతోంది. ఈ విషయాలన్నీ గమనించి పాలు పెరుగు తెచ్చేవారి కొరకు ఒక స్పెషలు బండి వేయుటము చాలా అవసరం.

విజయవాడకు వేసంకాలము యీ సంవత్సరము ఫిబ్రవరి మధ్యంతంనే వచ్చింది. ఉష్ణం నూరు డిగ్రీలు దరిదాపుదాకా జేరుతోంది. యింత ఉష్ణత మామూలుగా ఏప్రిలు నెలాంతంలో వచ్చేది. ఈ సంవత్సరం మంచెలంరోజులు ముందుగానే ఎండాకాలం ప్రారంభం అయినది కాబట్టి యీ యేడు రోహిణి కార్తిలో వానలు కురుస్తవని దైవజ్ఞులు చెప్పుచున్నారని ప్రజలు తృప్తిపడుతున్నారు.

ప్రతి వీధిపంపువద్ద సుమారు వంద బిందెలు నీటికోసం యెదురుచూస్తూంటవం, కొన్నిచోట్ల ముష్టియుద్ధాలు మామూలైపోయింది. దీనికి కారణం ఈ యుద్ధం రోజుల్లో ఊరి జనాభా రెట్టింపు పెరగటం. విజయవాడపట్టణం జనాభా లక్షన్నరయితే ముప్పదివేల జనాభాకే నీటి సరఫరా యేర్పాట్లు చేయబడి యుండుటవల్ల నీటిసరఫరాకు అధిక ప్రయత్నాల ప్రభుత్వ సహాయము లోపించడమే కారణమని మునిసిపలధికారులు చెప్పడం అలవాటయిపోయింది. ఏప్రిలు నెలాంతంలో అదనంగా యింకో భావి త్రవ్వినందువల్ల నీటి యిబ్బంది కొంతవరకు తగ్గిపోవచ్చునని అధికారులంటున్నారు.

ఇదిలావుండగా ఈ పూరి పురపాలక సంఘం కాంగ్రెసు మెజారిటీగల పరిపాలనాసంఘం అయినా శాసనసభా కాంగ్రెసుపక్ష రాజకీయాలన్నీ యిక్కడ వుండుటవల్లకూడా మునిసిపాలిటీ పరిపాలన సాఫీగాలేదు.

## మద్రాసు మంత్రివర్గంలో

### మహిళకు స్థానం

#### స్త్రీగవర్నరుకు, ప్రధానికి విన్నపం

మదనపల్లి, ఏప్రిల్ 8: చెన్నరాష్ట్ర మంత్రివర్గంలో మహిళకు స్థానమియ్యవల్సిందని మదరాసు గవర్నరును, ప్రధానిని కోరుతూ స్థానిక మహిళాసమాజం యాజమాన్యాన జరిగిన మహిళా సమావేశంలో ఒక తీర్మానం చెయ్యబడింది. సమావేశానికి అధ్యక్షత వహించిన శ్రీమతి కె. సుందరీదాయిగారు, మద్రాసు మంత్రి వర్గంలో మహిళకు ఒకస్థానం ప్రత్యేకించాల్సిన ఆవశ్యకతను వక్కాణించిరి. కేంద్రప్రభుత్వంలో ఒక మహిళ మంత్రిణిగా నున్నదనీ, ప్రకాశంగారి మంత్రి వర్గంలో కూడ మహిళకు స్థానమివ్వబడెననీ ఆమె తెలియజేసెను.

## మద్యనిషేధం కింద

### శిక్షలు

చికాకోల్, ఏప్రిల్ 7: అలపోలు గ్రామవాస్తవ్యుడు లచ్చిరామయ్య అను అతనికి త్రాగినాడనే నేరానికి రెండునెలల కఠినశిక్ష విధించబడెను. పోతయ్య అను వేరొక అతనికి ఒకనెల కఠినశిక్ష విధించబడెను.

కాయ అప్పన్న అనువానికి సారాయి దగ్గర ఉంచుకొన్న నేరానికి 6 వారములు, గుంటముక్కల రాజన్న అనువానికి త్రాగిన నేరానికి ఒకనెల, కఠిన శిక్ష విధింపబడెను.

మంగళగిరి సబ్ మాజిస్ట్రేటు కోనూరు నర్సయ్య అను అతడు సారాయి ఉంచుకొన్న నేరానికి రెండునెలల కఠిన శిక్ష విధించెను.

## ధర్మప్రచారక శిక్షణాలయం

విజయవాడ, ఏప్రిల్ 8: హిందూమత ప్రచారకులు కాదలచినవారికి శిక్షణనిచ్చే ఉద్దేశ్యంతో శ్రీ చంద్రశేఖర ధర్మశాస్త్ర విద్యాలయమును పేర మే నెల 8 నుండి జూన్ 7 వరకు పశ్చిమ గోదావరిజిల్లా కొకర పర్రలో వేసవి పాఠశాల నడుపబడును. సంస్కృతభాషాజ్ఞానం కలిగి నిత్యము సంధ్యావందనంచేయు అలవాటుకలవారు మాత్రమే విద్యార్థులుగా చేర్చుకోబడుదురు. 25 మంది విద్యార్థులకు ఉచితంగా భోజనం పెట్టబడును. సుప్రసిద్ధులైన మహాపండితులు అధ్యాపకులుగా నుండెదరు. ఇందులో చేరదలచినవారు యీ నెల 20 తేదీలోగా దరఖాస్తులు పంపుకోవలెను. అని ఆంధ్రరాష్ట్ర బ్రాహ్మణ మహాసభ కార్యదర్శి జటావల్లభుల పురుషోత్తం గారు వ్రాసిరి.

## ఆంధ్రరాష్ట్రమునకు కౌన్సిలు వుండదు

### గోపాలరెడ్డిగారి అభిప్రాయం

నెల్లూరు, ఏప్రిల్ 10: ఆంధ్రరాష్ట్రము విభజన అయినమీదట అసెంబ్లీలో వలె ఆంధ్ర తమిళ ప్రాంతములకు కౌన్సిలుసభలు ఉండకపోవచ్చునని ఆర్థికమంత్రి గోపాలరెడ్డిగారు పత్రికా ప్రతినిధులతో చెప్పిరి.

### మద్రాసుకు కేంద్ర ఉపమంత్రిరాక

కేంద్ర ఉపమంత్రి కె. సంతానంగారు మద్రాసుకు 14 సాయంత్రం వచ్చి 15 సాయంత్రంవరకు ఇక్కడనుండి తర్వాత దక్షిణాదిన పర్యటనిమిత్తము వెళ్లెదరు.

### రవాణామంత్రి మధుర తిరువేంద్రం పర్యటన

మధుర, తిరువేంద్రం కన్యాకుమారి బస్సుసర్వీసు చూచుటకు మద్రాసు ప్రభుత్వ రవాణామంత్రి గోపాలరెడ్డిగారు నెలాఖరున పర్యటన చేసెదరు.

### మంత్రి చంద్రమౌళిగారి పర్యటన కార్యక్రమము

మదరాసు, ఏప్రిల్ 9: మదరాసు ప్రభుత్వస్థానిక పాలనమంత్రి శ్రీ కె. చంద్రమౌళిగారు 14 వ తేదీ సాయంత్రం బయలుదేరి ఈరోడ్, ఉదుమల్ పేట, కొల్లెగాల్ వెళ్లి 18 వ తేదీ ఉదయమునకు తిరిగివచ్చెదరు.

## ఆంధ్ర విజ్ఞానసమితి

మదరాసు, ఏప్రిల్ 8: ఆంధ్ర విజ్ఞాన సమితివారు, రాయపేటలో శ్రీరామనవమి ఉత్సవం నిన్నసాయంకాలం శ్రీ ఆర్. బి. రామకృష్ణరాజుగారి అధ్యక్షతను జరిపిరి. ముందుగ శ్రీగంటి సూర్యనారాయణ ఘనాపాటి సోదరులు శ్రీరాముల పటమునకు పూజచేసి, వేదములు పనసలు పఠించిరి. తరువాత యశోదాదేవిగారి పాట కచ్చేరీ జరిగెను. అధ్యక్షులవారు వీరి పాండిత్యమును ప్రశంసించి, గాంధిగారి భజనలచే యిటీవల రామనామస్మరణ మనందరకు ప్రాణప్రదమయిందనిరి. ఆంధ్రదేశంలో శాస్త్రయుక్తంగా సంప్రదాయ సిద్ధంగా పాడగలిగినవారు అరుదనియు, పారుపల్లి రామకృష్ణయ్యగారు తప్పితే పేరుపొందిన పాటకులు వేరొకరు లేరనియు, యశోదాదేవి వారి శిష్యురాలయి, సంగీత ప్రజ్ఞను సాధించడానికి కృషి చేయుట ఎంతేను మెచ్చదగియున్నదనిరి. మంచిశారీరం, చక్కనిబాణీ, శ్రావ్యమయిన పాటగల్గియున్న యీమె త్వరలో గాన రహస్యం గ్రహించి పాండిత్యం సంపాదిస్తారని ఆశిస్తున్నామనిరి. సమితి తరఫున ప్రదర్శించిన నాటకాలలో అక్రూరుడు వేసిన మంగపతిగారికిని, ధర్మరాజు వేసిన పి. రామారావుగారికిని పెండిగిన్నెలు బహూకరించిరి.

కె. శ్రీరామమూర్తిగారు వందనము లర్పించుచు, కళారాధకులను సన్మానించ. దానికి విజ్ఞానసమితికి తగినశక్తి ఆంధ్రులంతా చేకూర్చాలని కోరిరి.

## హెచ్. యం. యస్. బర్మింగ్‌హాము నావ

### పత్రికా ప్రతినిధులతో క్యాప్టెన్ గోష్ఠి

చెన్నపట్నం, ఏప్రిల్ 9: హెచ్. యం. యస్. బర్మింగుహాము యుద్ధనావ కేప్టెన్ టి. ఏ. సి. పెకెన్హాముగారు యీవేళ మధ్యాహ్నం పత్రికా ప్రతినిధులను నావమీద కలుసుకొని యిష్టాగోష్ఠి సలిపిరి.

పత్రికా ప్రతినిధులు నావపైకి వెళ్ళగనే కేప్టెన్‌గారు వారికి వందనములు తెలిపి తనగదిలో ఆసీనులుగాజేసి వారితో అరగంటసేపు నావవిషయమై ముచ్చటించిరి. ఆముచ్చటింపులో కేప్టెన్ పెకెన్హాముగారు యీవిధముగా చెప్పిరి. బర్మింగ్‌హాము యుద్ధనావ యిటీవల ట్రింకోమలిలో జరిగిన నౌకావిన్యాసములందు పాల్గొని మదరాసుకు వచ్చినది. ఈ రాక విలాసార్థముకొరకు తలపెట్టబడెను. ఇక్కడనుంచి యీ నావ విశాఖకు కలకత్తాకు అండమాను దీవులకువెళ్లును. అండమానులలో నావ మే 9 నుండి 14 వరకు యుండును.

ఈ నావ యిప్పుడు పూర్వప్రాచ్యమునకు నియమితమైయున్నది. దాని శాశ్వత స్థావరము ట్రింకోమలి అయియున్నది. బర్మింగ్‌హాము యుద్ధనావ 7000 టన్నుల బరువు కలిగియున్నది. నార్ఫోక్ యుద్ధనావలో నున్న 8 అంగుళముల ఫిరంగులకు బదులు దీనిలో 6 అంగుళముల ఫిరంగులే యున్నప్పటికి దీని ఆయుధబలగము నార్ఫోక్ కంటె శ్రేష్ఠమైనది. నార్ఫోక్ కంటే యీ నావ 10 యేండ్లు తరువాత నిర్మితమైనందున నిర్మాణములోనే భేదమున్నది. ప్రస్తుతము యీ నావలో యిద్దరు భారతీయ ఆఫీసర్లు శిక్షణము పొందుచున్నారు. అది పూర్తియైనతరువాత యింకా కొంతమందిని, శిక్షణకై తీసుకొనే ఉద్దేశ్యం కలదు. నౌకాశాఖవారికి రాజకీయములు లేవు. వారు రాజకీయములకు అతీతులనిరి.

సమావేశం ముగిసినతరువాత ఆఫీసర్లు పత్రికాప్రతినిధులను నావచుట్టూ తీసికొనివెళ్లి చూపిరి.

## శ్రీ శే. ముసునూరి సూర్యనారాయణ భాగవతరు గారు

ఏలూరు, ఏప్రిల్ 9: హరికథాపితామహ, సంగీతగాయక శ్రీ ముసునూరి సూర్యనారాయణ భాగవతర్ గారు తమ 40 వ ఏట స్వల్పవ్యాధి పీడితులై అకస్మాత్తుగా నిన్న ఏలూరులో దివంగతులైరి. ఈవార్త తెలిసి, శ్రీరామనవమి ఉత్సవముల సందర్భంలో నున్న పట్టణమంతా విషాద సాగరమున మునిగిపోయినది. వీరికి ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె కలరు.

## నోటీసు

1945 మద్రాసు సిటీ యింప్రూమెంటు ట్రస్టు ఆక్టు 47 వ సెక్షన్ క్రింద నోటీసు.

ఇందు మూలమున తెలియపరచునదేమనగా, దిగువ దాఖలా షెడ్యూలులోని సరిహద్దుల లోపలనున్న ఏరియాకు, మద్రాసు సిటీ యింప్రూమెంటు ట్రస్టు బోర్డువారు యింప్రూమెంటు స్కీమును తయారుచేసియున్నారు.

2. దిగువ డాక్యుమెంట్లతోసహా, స్కీము తాలూకు వివరములన్నియు, మద్రాసు, నెం. 160 రు మౌంట్ రోడ్ నందలి బోర్డు ఆఫీసునందు ఆఫీసు రోజులలో యెప్పుడైనను ఉ|| 11 గం. లు మొదలు సా|| 5 గం. ల వరకు, ఉచితముగా చూడవచ్చును.

(a) స్కీముయొక్క డ్రాఫ్టుక్లాజులు
(b) స్కీములో చేరిన ఏరియా మ్యాపు (ప్లాన్ నెం. 1)
(c) ఏరియా లేఅవుటు (ప్లాన్ నెం. 2)
(d) ఉద్దేశించిన బిల్డింగుల ప్లానులు (ప్లానులు, 3,4)

పై 2 వ పేరా a మొదలు d వరకుగల ఐటములలో తెలిపిన స్కీము నిర్మాణము యొక్క డాక్యుమెంట్ల కాపీలు, రు 2/-లు (రెండు రూపాయలు మాత్రం) చెల్లించి, చేర్మన్ గారివద్దనుండి పొందవచ్చును.

స్కీములోనున్న ప్రపోజలుకు ఏమైన ఆక్షేపణలున్న యెడల, బోర్డు ఛేర్మన్ గారికి 10-6-49 లోపున వ్రాతమూలకముగా పంపుకొనవలెను.

షెడ్యూలు:

ఏరియాకు హద్దులు:
ఉత్తరం: జార్జి టౌన్ ఆర్. ఎస్. నెం. 11379/1, 11712 భాగము
తూర్పు: ఆర్. ఎస్. నెం. 11712 జార్జి టౌన్, భాగము (హైకోర్టుకాంపౌండు)
దక్షిణం: ప్రేసర్సుబ్రిడ్జిరోడు (ఆర్. ఎస్. నెం. 11713, జార్జి టౌన్ 10120 భాగము)
పడమర: ఎస్ప్లనేడ్ రోడ్డు, (ఆర్. ఎస్. నెం. 11379 జార్జిటౌన్ భాగము)

మద్రాసు సిటీ యింప్రూమెంటు ట్రస్టీల బోర్డు తరఫున, నాచే ఈ 1949 ఏప్రిల్ 2 వ తేదీన జారీచేయబడినది.

మద్రాసు 2-4-49 } కే. కే. నంబియార్, బోర్డు ఛేర్మన్.